శ్రీ

# బాలశతకము



 గ్రంథకర్త: 

కొణిదెన వేంకటనారాయణ.

శ్రీ

# బాలశతకము.

గీ॥ శ్రీలఁ జెన్నొందు శ్రీహరిఁ జిత్తమీ
భక్తితోఁ బూజసేసియుఁ బ్రస్తుతించి
సిద్ధకవిపుంగవుల నెల్ల నెంతుమదిని
లలితపదములతో నీతులొలుక బాల॥ ౧

గీ॥ శ్రీయు నారోగ్యసంపద స్థిరయశంబు
నాయురర్థముల్ విద్యయు న్యాయబుద్ధి
నిచ్చు; నీచిన్నిపొత్తంబు నీవుపట్టి
చిన్ననాఁటనె చదువుచు నున్న బాల॥ ౨

గీ॥ పుట్టితివి నీవు పుడమిపైఁ బూర్వపుణ్య
ఫలమువలనను మనుజ సంభవుడవగుచు
నింక నీవుండు పద్ధతు లేర్పడంగఁ
దెల్పెదను చేటమాటలఁ దెలియ బాల॥ ౩

గీ॥ తల్లిదండ్రుల నీయిష్టదైవములను
విద్యనేర్పిన గురులను బెద్దవారిఁ
దగిన చెలికాండ్ర సేవింపనగును నీకుఁ
జెందెదవు దానశుభములు చిన్నిబాల॥ ౪

గీ॥ శాంతగుణ మొకండుగల్గిన సద్గుణములు
వేయిగల్గినయట్ల; దిపాయునెడల
సకలశృంగారములతోను జాలు తాళి
లేనిస్త్రీవలెనగు దానిఁ బూను బాల॥ ౫

గీ॥ ఎవరికిని నిన్నుఁజూచిన నింపుబుట్టు
నటుల వినయంబుతోనుండ నొనుజుమ్మి
యెవ్వరేమేమి చెప్పిన రవ్వసేయు
కాత్మఁదలపోసి చేయుటయగును బాల॥ ౬

గీ॥ పరులనిందింపఁ బూనకు; పొరుగువారి
కలిమిఁ జూచిననేడ్వకు; చలముచేత
పట్టితిప్పలేరికినైనఁ గట్టఁబోకు;
పాపకార్యంబులివి సేయవలదు బాల॥ ౭

గీ॥ కాలమొప్పడు నేరిత్తకర్జములనో,
గడపుకొనఁదాన శ్రేయంబు గలుగఁబోవ
దింటిపనులనో, విద్యనో, యంటియున్న
మేలు; బుద్ధికి మాంద్యతతూలు; బాల॥ ౮

గీ॥ మంచిగొనములఁ జనువులఁ మించియున్న
వారిననుకరింపుము నీవుకోరినట్లు
చిలిపి బాలురఁజూచినఁ బలుకఁ
నైనవలవదు తలవంచి యరుగు బాల॥ ౯

గీ॥ పసిఁడియిచ్చిన కమసాలికసటుమాపి
వన్నెనిడి తెచ్చియిచ్చిన పగిదినొజ్జ

గీ॥ మంచిగాలిని బీల్చుట, మంచినీరు
ద్రావుచుండుట, శుచియైన స్థలమునందుఁ
గాపురంబుంట, సాధారి పక్వాన్నములను
గుడుచుచుండుట, రోగములుడుగు బాల॥ ౧౬

గీ॥ పలక, బలపము, పొత్తముల్, వస్త్రములను,
శుభ్రముగనుంచి వేకువఁ జారఁగ లేచి
దైవమును గొల్చి కాలకృత్యములఁ దీర్చి
తానమాడియు బడికిఁ బోఁదగును బాల॥ ౧౭

గీ॥ భాగ్యములను దేహారోగ్యభాగ్యమే సు
భాగ్యము; ల నేరికే నది పదిలపడదొ
వాఁడె నిర్భాగ్యుఁడగు సిరిఁ గూడకున్న
వానిననరాదు దానిని బడయు బాల॥ ౧౮

గీ॥ మంచివాఁడవు నీవని మాయఁ జేసి
కొంటెపిల్లలు నిన్నది కోరిరేని
తల్లిదండ్రుల నడుగక తస్కరించి
తేకు; మది చెడ్డతనమని తెలియు బాల॥ ౧౯

గీ॥ గురువువారములెను జెప్పఁ గూరుచుండి
చక్కగాఁ దాని చెప్పఁగా సంతసించు
శిశు సేయండు విద్యయు సత్వరముగ
వృద్ధియగుఁ గల్గు జ్ఞాపకశక్తి బాల॥ ౨౦

గీ॥ భూషణంబులకెల్ల సుభూషణంబు
విద్యయేసుమ్ము; యెవ్వండు విద్యలేడు

బుడమిశోభింపఁజేటను జడతమాన్పు
విద్యధరియింపు ; భ్రమలు విడచి బాల॥ ౨౧

గీ॥ చిన్నతనమున పనులను జేయుమనుచుఁ
దల్లిదండ్రులు చదివింపఁ దలఁచుకున్న
నీవె యెట్టులో చదువుచు నేర్పుతోడ
బికిరి మెత్తెడి పిల్లలవిధముబాల॥ ౨౨

గీ॥ భాను బింబంబు చేతను బంకజంబు
వికసనముఁ జెందుకైవడి విద్యచేత
బుద్ధివికసించు ; సంపదల్బొదలు ; శీల
మార్గమలవడు ; దీని నేమరకు బాల ॥ ౨౩

గీ॥ కుందనమునకు నెలిగారమందినట్లు
బాల్యమున విద్యలెస్సగాఁ బట్టువడును
గాన పరువైన సమయంబు గాలిఁబోవఁ
జేయకెప్పుడుఁ జదువుమ చిడక బాల॥ ౨౪

గీ॥ కుదురుగాఁ దరగతి నీవుకూరుచుండి
ప్రక్కవారితో మాటలుదక్కి యొజ్జ
యేది సేయుంగ నియమించు నాదరమునఁ
జేయు మది; నీకు శ్రేయమౌనోయి బాల॥ ౨౫

గీ॥ బాలురందఱకంటెను మేలువాఁడ
వగునటుల నీవు చురుకుగా నరుగఁదగును
జేనఁజొచ్చిన వెనుకఁజఱఁబూనబోక
పరువున మేలుబంతివై నెగడుబాల ॥ ౨౬

## బాలశతకము.

గీ॥ చదువునప్పుడు, దేవుని ముదముతోడ
భక్తిఁ బూజించునప్పుడు, వలయుపనులు
చేయునప్పుడు, భయమును, సిగ్గు వలదు
చెడుపనులు చేయు నెడ నుంపఁ జెడవు బాల॥ ౨౭

గీ॥ భాగ్యమును జూడఁ గన్నులపండువైన
రూపమును జూచి యెవరునీ దాపుఁ జేరి
ముద్దులాడంగ వత్తురే! మొద్దు వోతె
చదువు సద్గుణములు విడి బ్రదుక బాల॥ ౨౮

గీ॥ గురువు శిక్షను దప్పించుకొనుట కొఱకు
నప్పుడప్పుడ వల్లించి యొప్పఁ జెప్పి
మఱుదినంబున లేకుండు మాయ చదువు
వలవదే వేళనుఁడగా వలయు బాల॥ ౨౯

గీ॥ తల్లిదండ్రుల మఱపించి తరలిపోటనో
యాటలాడుచు నెప్పుడు గూటదీప
ముంచిన సిలుసెంక యెష్ఠొ యొదిగియొదిగి
చేరి చదువక యుండకుమోరి బాల॥ ౩౦

గీ॥ నీళ్ళ, నిప్పుల, ముఁదుల, రాళ్ళ, నీకు
నాడఁబనిగాదు కీడగునయ్య యెందు
చెట్లు గుట్టలు గోడలు గట్లనెక్క
జనకు పడినను చిమకొను తనువు బాల॥ ౩౧

గీ॥ గొప్పకులమునఁ బుట్టితి నొప్పఁగుల్కు
రూపముండెనటంచుఁ గుఱ్ఱలైన

మనుజులను హీనకులులను గనిన నగకు
చేతనగునంత ధర్మముఁజేయు బాల ॥ 32

గీ॥ ధార్మికుని సిరియెల్లను ధర్మమునకుఁ
జేరునట్టుల వంశనిక్షేపమైన
బాలుఁడేవేళ బుధజనప్రాయుఁడగుచు
నుపకరించును బ్రదుకు సత్కృపను బాల ॥ 33

గీ॥ పెక్కువృక్షంబులను నొక్కచిక్కు పరిచు
శమ్ముల విడజల్లు మలయజద్రుమము మాధ్వీ-
వేలయునొకడైన సుగుణము లలమియున్న
బాలకుఁడు పిల్లలకు మధ్య బడిని బాల ॥ 34

గీ॥ ఎన్ని విఘ్నము లేకమై వన్నియున్నఁ
జేతఁబట్టినపని పూర్తిచేసిగాని
విడువనను గట్టిసియమంబు పెట్టుకొనుము
దానఁ బనులన్ని సఫలములౌను బాల ॥ 35

గీ॥ దీర్ఘకోపంబు మనమున దీటుకొలిపి
యెరినైనను సాధింపఁ గోరరాదు;
ఎంత యవమానపడియును సుంత యైనఁ
జింతనేయక యుండుము సోచించి బాల ॥ 36

గీ॥ కఠినముగ మాటలాడిన గౌరవంబు
పోవుటేగాక తగవులు బుట్టుఁగాన
వలదు; ప్రియముగఁ జెప్పుడుఁ బలుకు మెందు
దానఁ బ్రేమజనించు నందఱకు బాల ॥ 37

గీ॥ ఎట్టిపగవారికైన నీ కెప్పుడుగాని
కీడుఁగోరకు కల్గిన వేఁడువలదు
నుండకేగియు వేగిర మండయుగుదు
కడవఁ బెట్టఁగ నాపదల్ గడగిబాల॥ ౩౮

గీ॥ తల్లిదండ్రుల గారవమెల్లఁ దొలగ
నేమునకు చూచినని తెచ్చియిమ్మనుచును
తల్లిదండ్రుల యాజ్ఞలనెల్ల నెపుడు
చేయుచూ! శిరసావహించియును బాల॥ ౩౯

గీ॥ కుడుచుటయుఁ ద్రావుటయు నిద్రఁగొనుట చేయు
పనులు చదువులు వ్యవహార వర్తనములు
క్రమముదప్పక నడుపుమీ! కానియెడల
వ్యాధులలమును సంకటపడుదు బాల॥ ౪౦

గీ॥ శుచిగ నొకచోట స్థిమితముఁ జూచినిలచి
విశ్వరక్షకుఁడైన గోవిందునామ
ముక్తకంఠమైన స్మరియింప నోపుచేని
సర్వశుభములు పొందెదు సతముబాల॥ ౪౧

గీ॥ అతఁడుచేసినఁ జేయుదుననుచు నెపుడు
నొకరితో వంతునకుఁ గూరుచుండరాదు
చేయవలసిన పనులను న్యాయముగను
విధియనుచుఁ జేయుమెపుడైన విడక బాల॥ ౪౨

గీ॥ చేయుగానీకు సేవనిఁజేతగాక
పరిహసింపంగఁ బోయెదీ పాపమేమొ?

ఎన్ని నేర్చినఁ జేసిన నెవరిపనులు
గనినఁ బొగడుట మంచిదిగదర బాల॥ ౪౩

గీ॥ తినక పెట్టక మూటల మునిఁగి తేలు
కృపణుని ధనంబులట్టుల నుపశమించుఁ
దిరిగి చదువక యుక్తులకుఁ గఱపఁ బోక
మదిని బదిలంబు చేసిన చదువు బాల॥ ౪౪

గీ॥ చదువు నేర్పుట బుద్ధిని జక్కఁ బఱచు
కొనటకుంగాని దుష్టులఁ గూడి యెపుడుఁ
గుట్టలను జిన్ని కొండలు గూల్పఁగాదు
వలదనిన వీడకుండ నెవ్వరికి బాల॥ ౪౫

గీ॥ బలముగలవాడనంచు దుర్బలురిటన్నఁ
గర్వ మొనరింపఁ గాల్దువ్వఁ ఘనతముగాదు
నిన్ను నొప్పించు వాఁడైన నీబలంబు
వ్యర్థమగుఁగాదె! బీరముల్ వలదు బాల॥ ౪౬

గీ॥ బడికిఁ బోనొల్లక గురుండు బాగుగాను
జదువుఁ జెప్పిన దినమొందు వెదకి లేదు;
ఏలపోవలె బడికి? నే నేమి చదువ?
ననుచుఁ బోషించువారితో ననకు బాల॥ ౪౭

గీ॥ ఎఱుఁగ రెవ్వరు నాకిది తరుణ మంచుఁ
బోకు పాపము లొనరింప నోకుమార!
నీవు మనుజుల కనఁగప్పనేర్తు వేని
దైవముండదె సత్యము దలఁప బాల॥ ౪౮

గీ॥ మాటలను నేర్చి యెవరైన మాటలాడ
వినువు కొనురీతి నేమము ప్రేలఁదగదు
యుక్తయుక్తముగా ననుగక్తి కలుగ
మితముగాఁ బల్కఁదగును యోగ్యతగ బాల॥ ౪౯

గీ॥ గురువు కోపించునని లోనఁ గొణఁగికొనుచు
నడుగుమాటకుఁ బ్రతిఁ జెప్ప నుడుగ రాదు
తడవు సేయక ఘంటాపథంబుగాను
ప్రశ్నలకుఁ జెప్పఁదగిన జవాబు బాల॥ ౫౦

గీ॥ చెప్పినది మోసమయ్యెను చెయ్యవలెన్నఁ
జెప్పఁబూనకు సాగిన యొప్పు తిల్ల
చెప్పకుండినదానినే యొప్పులైనఁ
గలుగునెడ వెంటనే చెప్పవలయు బాల॥ ౫౧

గీ॥ పాఠముల నెక్కరోజైన వదలకుండ
పట్టుదలతోడఁ జదివిన వచ్చు విద్య
లేనిచో నేండ్లుపోయినఁగాని రాదు
బడికి సెలవంచు కోఱలుగదుప బాల॥ ౫౨

గీ॥ వస్తుబడియున్న వప్పును బట్టఁబోకు
వ్యయము సేయకు ద్రవ్యంబు వ్యర్థముగను
కూడబెట్టు మార్గమందు కొంతయైన
ధర్మమును సేయుటాక కొంతతగును బాల॥ ౫౩

గీ॥ చెడినపనులను దలచుక చిత్తమందు
తీవ్రముగఁ జర్చ సేయుచు దిగులుపడుట

యధికనాశంబెకాని యేనాను దానఁ
జేయునవియుఁదె చెడకుండఁ జేయు బాల॥ ౫౪

గీ॥ శ్రమకుఁ బాలింబులని నీ ప్పదువులుమణి
చేయనౌకార్యములు పఁదఁజేసిసిసివి
చివికి చింతను దేలి యోచింపఁబోకు
శాంతముగ నిర్వహింపుమీ సరిగ బాల॥ ౫౫

గీ॥ వంపనౌ మంచి చేతినెవ్వారనైన
గాని పగఁబూన లవలేశ మేనిఁగాదు
నతుముమీరఁగ నెంకును నడువుమటులె
మానవులఁదండఁ బగసేయమానిబాల॥ ౫౬

గీ॥ ఇంటివారితోఁ గోపించియింటనింటఁ
గాఁవుంపుగుట్టుఁ జెప్పుటగాదు గొప్ప
యొకరికంటెను హీనతనుండియైన
గుట్టుగా జీవనముసేఁత గొప్పబాల॥ ౫౭

గీ॥ మాట నెఱపుకొనంగల్గి యోటులేక
యుక్తి సంభాషణంబుచే శక్తి కోలఁది
నొప్పు తప్పుగనూర్చి తప్పొప్పుఁజేసి
మోనమొనరింపక ది నీకుముప్పుబాల॥ ౫౮

గీ॥ కీడుఁజేసిన వారికే మేలుజేయ
నది మనంబున వానినాయాసపెట్టు
వేఱురీతిగఁ గీడును వెదకుదేని,
నీకెయానది యీమాటనిజము బాల॥ ౫౯

గీ॥ పుష్పమును వాడఁజేయకే పుష్పరసము
ద్రావు మధుపంబుకైవడిఁ దా నెవరిని
నలయఁజేయక గుణవిద్య లమరునట్లు
పాటుపడు మంచిబాలుఁడు బడిని బాల॥ ౬౦

గీ॥ ఎవరిఁజూచిన భయభక్తు లెఱుఁగకుండ
నెపముకై నడి దెబ్బలకిచ్చి వీఁపు
దుడుకుఁదనముఁను చేయుచు నడచుపాపఁ
డెను మొఱకుఁగాక; కుఱ్ఱఁడే? యెన్న బాల॥ ౬౧

గీ॥ ఎట్టివిద్యలభ్యాసముం బట్టియుండుఁ
గాన వీనకు ప్రాణాంతమైనదాఁక
దేన సాధనసల్పెదో దాన నీకుఁ
గొంగ్రు బంగారమగుచుండుఁ గూడి బాల॥ ౬౨

గీ॥ అదరిపాటేమిలేకుండ నందఱయెడ
నొక్కటొ సోదరన్యాయమున్నవాని
దైవమెప్పుడు దీవించుఁ దనకుఁబోలి
యుండునట్లుగ; నారీతి యుండు బాల॥ ౬౩

గీ॥ సంద్రమునఁజేరి చెడియెడు జలములట్లు
దుష్టులనుగూడఁ జెడుదువు; దుగ్ధములను
నీరు చేర మేలైనట్లు నీతిపరుల,
నెయ్యమొనరించి బుధుడవై నెగడు బాల॥ ౬౪

గీ॥ ధన కుల, సురూప ములకును ఘనుడవైన
గౌరవము, కీర్తి, సంస్తుతుల్, గలుగఁబోవు;

ధర్మమున్న న్యాయమును బుద్ధిఁదగిలె నేని
కలుగు నీకెల్ల శ్రేయము; లలనబాల। ౧౫

గీ॥ కూడుగుడ్డకుఁ బేదయు, గురు వినీతి
నధికుతోడ సమంబుగ నలరుచుండుఁ;
దలఁగునేనీతి, వాఁడు సంతాపతప్త
దేహుఁడౌ బుద్ధి సంపద దెగుట బాల। ౧౬

గీ॥ నీకెవరు చెప్పి చెడుపని నెఱపుమన్న
మాటవిని చేయఁబోకు మోమాటముంచి
తగినపనియైనఁ బదుగురు దలఁపకున్న
మానె; యొనరింపుమీ! యవిపూనిబాల। ౧౭

గీ॥ గురువు నిన్నెప్డు కోపించి కొట్టె నేని
మనసులోనైనఁ దిట్టుటమాని యతఁడు
సాయమే మేనిఁగోరిన సలిపి గురుని
ఋణము నీఁగుట యొప్పిన గుణముబాల। ౧౮

గీ॥ పెద్దబండను దలమీఁద పెట్టియున్న
మోయుదే? కూలిపడి నలిగిపోదుగాక
యీడెఱుంగక యింతంత లేసి పొత్త
ములను జదువ మెదడు చెడిపోవు బాల। ౧౯

గీ॥ మొలకమంటిది రోజులకొలఁదిఁ బెరిగి
పెరిగి వికసించి పెద్దదై వెలయుఁగాదె?
విద్యలన్నింట నొకనాఁడె పెద్దఁజేయు
మన్న నెట్లయ్యె? క్రమముగా నగుదుబాల। ౨౦

గీ॥ తనకుఁ దానెద్దియును దీర్పఁదగినశక్తి
యేపనులు నంతలో సేయనేర్చుఁగుబుద్ధి
కౌశలంబును, మాహాయు, గలుగునట్లు
చదువు మెప్పుడు; వల్లెలు వదలిబాల॥ ౭౧

గీ॥ చెఱచి యితరుల తామును జెడెదు నరులఁ
వేదముల వర్ణముల దూరి వాదులాడ
వినకు చెవియిచ్చి నీకది పెంపుగాదు
చెడుదు నీపూర్వధర్మము చెఱచిబాల॥ ౭౨

గీ॥ ఆచరించి ధర్మములెల్ల నఖిలమునకుఁ
గర్తలై ధర్మపథమును గదలకుండ
ధర్మములు బోధచేసిరి దయఁదలిర్పఁ
బూర్వికులువాని నలుపంగఁ బోలుబాల॥ ౭౩

గీ॥ రిక్తగాఁ గూరుచుండియు భుక్తికొఱకుఁ
జేయుయోచన లేమిట శ్రేయమౌను?
పనులయందున శక్తితోఁ బాటుపడుచు
బ్రతుకఁదగవగు నెప్డుయోగ్యతగబాల॥ ౭౪

గీ॥ భూతహితవుగ నేకార్యములనునైనఁ
జేయుశుభదంబె కాకున్న జేటుఁదెచ్చు;
తనకెయాయుష్య మారోగ్యమని దలంచి
క్రూరమును సల్పబోవుమార్గునకుబాల॥ ౭౫

గీ॥ దైవమును నమ్మితాఁబ్రయత్నంబు నలుప
నెట్టికార్యంబులైన గట్టెక్కుచుండు;

లేనిచో నన్ని విఫలంబులౌను గృషియు
వర్షమును లేని సస్యంబువగది బాల॥ ౨౬

గీ॥ ఏల? సంపాదనకుఁగాని మేలిగొనము
లబ్బుటకుఁగాని చాలని యట్టిచదువు;
రెండుగల్గియు నిహపరముండునట్టి
చదువుఁ జదువంగ సంతోషమొదవు బాల॥ ౨౭

గీ॥ పొత్తముల నక్షరపు రూపమునను నిలుచు
భారతీదేవి; కావునఁ బ్రబలమైన
భక్తి నిత్యము పాఠముల్ పఠనజేయు
నపుడు దలఁచిన విద్యలు నమరు బాల॥ ౨౮

గీ॥ వ్రాతబల్లలు, పటములు, పలకబలప
ములు, సిరాబుడ్లు, కాగితములు, కలములు,
అంబ - వాణి - వసింపగా నమరునిండ్లు
కాన వానిని భక్తితోఁ గనుము బాల॥ ౨౯

గీ॥ దేశభాషను, గణితము, దేశధర్మ
ములను, ముఖ్యంబుగా నేర్వవలయు మొదట;
పిదపఁదన కులోచితమైన వృత్తిఁబూని
భుక్తికై పాటుబడుటది పోలు బాల॥ ౩౦

గీ॥ చాల పొత్తములెల్లను జదివికొనుచు
శుద్ధమగు భాష నేర్వంగఁ జూడుమయ్య;
వ్యర్థమగుభాష నేర్వకు పలుకఁ బోకు
తనువు కష్టంబెగాయది తలుప బాల॥ ౩౧

॥ ధర్మసంగర మొనరింప ధర్మపరుల
చరితలను నేర్చివారల సద్గుణములు
నిన్నుఁబొందంగ నడువుమీ! నియతినట్లు;
పేరుగల్గిన బ్రతుకునుగోరి బాల॥ ౮౨

॥ మోదుజివురింప, గింజలు మొలకలెత్త,
రాలుకరుగంగఁ బక్షులు వ్రాలమీఁద,
గానకళ నేర్తువా! నీవఘనుడవగుదు;
వెల్లరును నీకెనశులాదు రేఁగు బాల॥ ౮౩

॥ చిత్తరువు బాగుగా వ్రాయఁజేతనైన
దేవతా రూపములను జిత్రించిచూపి
మనుజులకు భక్తిఁకలిగించి మనుపవచ్చు;
న్యాయపద్ధతి ద్రవ్యమునబ్బు బాల॥ ౮౪

॥ చేతిపనులు సేద్యంబును జేయువిధము,
బాగుగా నేర్చికొనుము నీబాగుఁదెరువె;
స్వేచ్ఛగా జీవనంబును జేయవచ్చు;
గౌరవముతోడి బ్రదుకొనుగాదె బాల॥ ౮౫

॥ చిన్ననాఁటఁ బ్రహ్లాదుండు శ్రీహరీ! జ
గన్నియామక! ననుఁబ్రోవఁ గంబమందుఁ
బొడమవే యనఁబుట్టి మేల్పొదలఁజేసెఁ;
గాననాహరిభక్తిచే గాంచు బాల॥ ౮౬

॥ నారదాదులరీతిగాఁ గోరినీవు
కృష్ణ!, గోవింద!, కేశవా!, విష్ణురార!

మానుచు హరినామములను కీర్తనము జేసి
పాపముల నెల్లఁ బాపఁగావలయు బాల॥ ౫౭

గీ॥ చిఱుతనాఁడె శ్రీకృష్ణుండు చెలఁగువాఁడు
తల్లిదండ్రుల బాధలు తలఁగఁద్రోసి
ప్రజలనందఱ రక్షించె పరమకృపను
చిన్నవాఁడైన గుణమునఁ బెద్ద బాల॥ ౫౮

గీ॥ మనుజులందున ఘనుఁడెప్డు కనఁబడండు;
యొదిగియుండును; నీచుఁడు గొదగఁబోక
యాడుచుండును లేచి పుల్లాకువోలెఁ,
గాన ఘనునిట్లు కనిపెట్టి కాంచు బాల॥ ౫౯

గీ॥ న్యాయపథమును దప్పక నడచునరుఁడు
పేరుబొందంగఁ గానివి పెట్టుకొనఁడు
విహిత కార్యములను జేసి వెలయుచుండుఁ
బ్రజలకెగ్గులు సలుపఁ జాల్పడక బాల॥ ౬౦

గీ॥ అక్కరనుబట్టి యాచారమొక్కరణిని
బుధులు మెత్తురు? కైకొనఁ బోలదెందు
ధర్మమారసి నడువఁగాఁ దగును సత్య
వాక్కునెపు త్రాటఁ గట్టంగఁబడుచు బాల॥ ౬౧

గీ॥ నిన్ను శిక్షించువారు లేకున్న, నున్న
నీకు నీవె సాక్షిగనుండి దేవుతోడ
నీతిమార్గముపేక్షింప నేరవలయుఁ
చెప్పువారలు లేరని చెడకు బాల॥ ౬౨

గీ॥ జంతువులు, శకుంతములు, వృక్షములు, నదులు
సంద్రములు, పర్వతంబులు, జలధరములు
ధర్మమునఁదప్పి మెలఁగవీ ధరనుకంటె!
వానివలె నీవునుండగావలదె బాల॥ ౯౩

గీ॥ కాసు, వీసము పోలని ఘనులు కొంద
ఱన్నిటను తా మెయధికులమంచు నెగడి
ప్రజలచే చెప్పు చీవాట్లు పడుచునుంద్రు
వలవదట్టుల, నీశక్తి మెలఁగుబాల? ౯౪

గీ॥ చిత్ర మీశ్వరసృష్టి; విచిత్రమౌను
దానికంటెను కులముల గిగవులాట;
ఏంతకధికంబు చదివియు నంబనైన
స్వకులధర్మంబునైనఁ, జెవదలబాల॥ ౯౫

గీ॥ నూరుమాటలు క్రియమాని నుడువుకంటె
నొక్కటైనను క్రియఁజూప నొప్పునెందు
నూరునీతులు నేర్చి నీవూరకుండు
కంటె నొకటైనసల్పుట ఘనముబాల॥ ౯౬

గీ॥ మల్లెపూఁదావి వలె మంచిపిల్లలెపుడు
నిట్టినీతులునేర్చి యెల్లకడలఁ
బొగడఁబడుచుంద్రు నూవె యీభువిని బేట
వెన్నెలలను మించెడు కీర్తి వెలుఁగబాల॥ ౯౭

గీ॥ మనలకధికారులై మెలుగన(గ( జేయు
నధికవిద్యాప్రవరులు విద్యాధికారు
లకు( బ్రజాప్రభుత్వపు సభ్యులకును నెపుడు
జయముగలుగ దేవుని వేడ(జనుము బాల॥ ౯౮

గీ॥ మనల కాపదలను బాపి మనుచునట్టి
వాను దేవున కెప్పుడు దోసిలొగ్గి
భక్తి( బ్రార్థించి జయజయధ్వను లెసంగ
మంగళారతులను నిచ్చి మనుము బాల॥ ౯౯

గీ॥ పావనంబైన కౌణిదెన వంశమందు
నతుడు వేంకటనారాయణాఖ్యు( డెలమి
బాల గీతాళిసీతులు జాలనించి
శతకమును( జెప్పె( బాలురు చదువ బాల॥ ౧౦౦



